గాయత్రీ గ్రంథమాల - 27
ప్రథమ ముద్రణ : 2000 ప్రతులు

ఈశ్వర భాద్రపదం
( 1 అక్టోబర్ 1997)

మూల్యము : ఉచితము

ప్రతులకు :

1) గాయత్రీ ఆశ్రమ ట్రస్టు, వ్యాస్ నగర్, సికింద్రాబాద్ - 61

2) స్వస్తిక్ మెటల్ ప్రొడక్ట్స్, 3-3-738, కంచరి బజార్, సికింద్రాబాద్ - 3.

3) వైదిక సాహిత్య భండార్, ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001.

4) ఆర్. కృష్ణమూర్తి బుక్ సెల్లర్స్, ఆర్యసమాజ మందిరము, సీతాఫలమండి, సికింద్రాబాద్ - 61.

5) ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా)

PRINTED AT ✆ 812904
PRINTSHOP
D.T.P. - OFFSET - SCREEN
SECUNDERABAD - 500 003

# శ్రీమతి లక్ష్మీదేవి ప్రేరణాత్మక జీవనం
## (ఆర్యపథిక్ పం. లేఖరాం గారి ధర్మపత్ని)

1902 జూలై 3వ తేదీన జలంధర్ నగరంలో లక్ష్మీదేవి స్వర్గస్థురాలైరి. జలంధర్ ఆర్యసమాజికులత్యధిక సంఖ్యలో అత్యంత శ్రద్ధాభక్తులతో అంత్యేష్టి సంస్కారంలో పాల్గొని ఆమెకు అంతిమ వీడ్కోలు చెప్పారు. ఈ దేశంలో ఎందరో స్త్రీలు కేవలం పేరుకు మాత్రమే కీర్తినార్జించారు తప్ప వారు ప్రపంచమున కెలాంటి మేలు కలిగేపనిని చేయలేదు. కాని కొందరు స్త్రీలు తమ సత్కార్యములతోను, సత్ సంకల్పములతోను ప్రపంచమును నరకంగా మారకుండా రక్షించుచున్నారు. ధర్మవీర్ పండిత. లేఖరాంగారి సతీమణి శ్రీమతి లక్ష్మీదేవికూడా అటువంటి శ్రేష్ఠ మహిళలో ఒకరు.

శ్రీమతి లక్ష్మీదేవి ( స్వామీజీ ప్రతీసారీ "శ్రీమతి లక్ష్మీదేవి గారు" అనే వ్రాశారు) బాల్యమును గూర్చికాని ఆమె తల్లిదండ్రులను గూర్చికాని ఏమీ తెలియదు. మరీనగరమునకు సమీప కొండ ప్రాంతంలో ఆమె జన్మించినట్లు మాత్రమే తెలుసు. ఆమె 16వ ఏట పం. లేఖరాంగారితో వివాహమైనది. వివాహమైన 2-3 సం॥రంల తరువాత ఆమెను పండిత్‌జీ జలంధర్‌లో తనవద్దకు తీసుకువచ్చారు. పండిత్‌జీతో నాకు గల సన్నిహిత సంబంధంవలన శ్రీమతి లక్ష్మీదేవి స్వభావాన్ని గూర్చి నాకు బాగా తెలుసు. ఆమె మొదటినుండి మితభాషిణి. అవసరమున్నదానికంటె కూడా తక్కువగా మాట్లాడేవారు. ఆమె శీల స్వభావం ఉన్నతమైనది. ఆమె స్వభావాన్ని తెలుసుకొని ఎవరైనా ఆమెకు సహాయపడాల్సిందే కాని తనంతట తానుగా ఎవరితోనూ ఆమె తన అవసరాలను గూర్చి ఎన్నడూ చెప్పటం గాని ఇతరులను కష్టపెట్టడంగాని ఆమె చేయలేదు.

వివాహమైన నాటినుండే ఆర్యపథిక్ పం. లేఖరాంగారు తన ఉద్దేశ్యాల ననుసరించి పనిచేయనారంభించారు. అంటే వారు తన ప్రసంగాలలో స్త్రీలకు విద్యయొక్క అవసరమును గూర్చి ఎంత ఉత్సాహంగా ప్రచారం చేయుచుండిరో అదే ఉత్సాహంతో తన ధర్మపత్నికి చదువుచెప్పుట కూడా ప్రారంభించారు. జలంధర్‌లోని స్త్రీల ఆర్యసమాజమునందు, ఆర్యసమాజ సాప్తాహిక సత్సంగాలలోను శ్రీమతి లక్ష్మీదేవి నియమపూర్వకంగా పాల్గొనేవారు. స్వర్గస్థులైన ఆర్యపథిక్ పం. లేఖరాం గారు తానేవిధంగా పురుషులకు స్వయంగా సేవచేసేవారో అదేవిధంగా

మహిళాలోకానికి తన ధర్మపత్ని సేవచేసే విధంగా ఆమెను తయారుచేసేవారు. వారు తన భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి నాతో అనేకసార్లు మాట్లాడేవారు. శ్రీమతి లక్ష్మీదేవిని గూర్చి కూడా అందులో ఉండేది. వాన ప్రస్థమును గూర్చి మాట్లాడునపుడు లక్ష్మీదేవిని గూర్చి కూడా మాట్లాడేవారు. ఆయన ఆమెనెలా తయారు చేయాలనుకొనేవారో ఆయన సద్ధర్మప్రచారక్ అనే పత్రికలో ముద్రించిన తన దినచర్యను చూస్తే తెలుస్తుంది.

"అగ్ని హోత్రాన్ని లక్ష్మీదేవిగారు చేస్తూండాలి." అంటే గార్హపత్య - అగ్నిని రక్షించే కార్యం తన గృహపత్ని కప్పగించి ఆమెను "ఆర్యా" అనే పదమునకధికారిణిగా పండిత్‌జీ చేశారు. అదే లేఖలో మూడవ వరుసలో యిలా వ్రాశారు.

"11 గం॥ల నుండి 2గం॥ల వరకు భోజనం, విశ్రాంతి, గృహకార్యాలు మరియు లక్ష్మీదేవిగారిని చదివించుట"

జలంధర్‌లోనే లక్ష్మీదేవికి సంతానం కలుగుట, అచ్చటనే తన ప్రియపుత్రుని వియోగం కూడా సహించవలసివచ్చింది. ఆమె తన భవిష్యత్ కార్యక్రమమునకై తయారగుచుండుట వలన తన పుత్రుని అనారోగ్యమునకు తానుకూడా ఒక కారణమైనది.

ఆమె స్వభావంతో సిగ్గు, నమ్రతలు ఎక్కువగా కలిగియుండేవారు. పరిచయంలేని స్త్రీలతో మామూలుగా మాట్లాడటానికి కూడా ఆమె సంకోచించేవారు.

పం. లేఖరాంగారు తన ధర్మపత్ని తన వద్ద శిక్షణ పొంది ఆ సహాయంతో మహిళలలో వైదిక ధర్మమును ప్రచారం చేయాలని తలంచుచుండేవారు. ఆయన నన్ను ఎన్నోసార్లు లక్ష్మీదేవి ఉత్సాహాన్నెలా పెంపొందించాలని అడుగుతుండేవారు. నేనాయనతో ఆర్యసమాజ వార్షికోత్సవాలకు తనతో ఆమెను తీసుకువెళ్ళుచుండమని చెప్పేవాడిని. నామాట నంగీకరించి అంబాలా కంటోన్మెంటు, మథురలలో జరిగిన ఆర్యసమాజ ఉత్సవాలలో లక్ష్మీదేవిని ఆయన తనతోపాటు తీసుకెళ్ళారు. బాలునకు అనారోగ్యం ఎక్కువైనందున అచ్చటినుండి ఆమెను వెనుకకు తీసుకొని రావలసి వచ్చినది. ఇది బహుశా 1896 సం॥రం. లో వర్షఋతువు కావచ్చును. దీని తరువాత మహర్షి దయానంద సరస్వతి జీవితచరిత్ర ముద్రణ కార్యమారంభం కావలసి యున్నందున లక్ష్మీదేవి తన భర్తతో పాటు జలంధర్ నుండి లాహోర్ వెళ్ళవలసి వచ్చినది.

ఇంకా ఆమె తన పుత్రుని మరణ దుఃఖమును మరువనేలేదు, ఇంతలోనే

మరొక విశ్వాస ఘాతక భూతం ఆమె ముందే తన ప్రియమైన భర్తను కత్తితో కడుపులో పొడిచి పారిపోసాగెను. ఆ వీరనారీమణి అతడిని వెంబడించి ఆ హంతకుని చేతిలో నుండి కత్తిని లాగుకొనుటకు ప్రయత్నించగా ఆమె చెయ్యి కూడా తెగినది. ఈ దుర్ఘటనలను గూర్చి 1897 మార్చిలో సమాచార పత్రికలలో ప్రచురించిన ఉద్రేకపూరిత వ్యాసాలను, వార్తలను చదివిన సజ్జనులకు బాగుగా తెలియును.

తనపుత్రుని, పతిని యిరువురను వైదిక ధర్మసేవలో బలిదానమొనర్చిన లక్ష్మీదేవి తన అత్తగారితో పాటు తన గృహమునకెళ్ళిపోయిరి. కొంతకాలం తరువాత అచ్చటినుండి ఆ దేవతలిద్దరు జలంధర్‌లోని మా గృహమునకు వచ్చారు. అప్పుడు ముస్లిం గుండాల గ్రూపులు ఆర్యసమాజమునకు వ్యతిరేకంగా మంటలు లేపుచుండిరి. ప్రతి క్షణం ఆర్యసమాజ నాయకుల, ప్రచారకుల ప్రాణాలకు ముప్పువాటిల్లు చుండేది. జలంధర్ ఆర్యసమాజ సభ్యులు ఎక్కువ ఉత్సాహవంతులుగా ఉండేవారు. జలంధర్ ముస్లింలలో కూడా పక్షపాతం ఏమాత్రం ఉండేదికాదు. అందువలన నేను పం. ధర్మవీర్‌గారి తల్లిగారితో ఆమెను జలంధర్‌లోనే తన కోడలితో పాటు ఉండమని కోరాను. కానీ తల్లిగారికి తన కుటుంబంపైగల ప్రేమ ఆమెను రావల్‌పిండి వైపులాగుచుండేది. లక్ష్మీదేవి ఒంటరిగా నుండుట కిష్టపడనందున ఆ దేవతలిరువురు మరల రావల్‌పిండికి వెళ్ళిపోయారు.

రావల్‌పిండికి వెళ్ళిన తరువాత లక్ష్మీదేవి ఆరోగ్యం బాగా క్షీణించసాగింది. ఒక సామాన్య స్త్రీకూడా తన సామాన్య భర్తవియోగంతో దుఃఖంలో మునిగి పోవును. అటువంటప్పుడు అత్యంత భావోద్వేగంతోకూడిన ఆవేదన గల ఒక మహిళయొక్క హృదయంలో ధర్మవీరుడు సాహసికుడు యశస్వంతుడైన పతి మరణ దుఃఖముయొక్క ప్రభావమెంతగా ఉండునో సహజంగా ఊహించవచ్చును. రాత్రింబవళ్ళు దుఃఖంతో ఆమె నిద్రాహారాలు లేకుండా గడిపారు. దానితో ఆమె జీర్ణశక్తి చెడిపోయింది. శరీరం కృశించి బలహీనమై రోజు రోజుకు పరిస్థితి క్షీణించసాగింది. ఐనా ఈ విషయాలేవీ నాకు తెలియజేయనేలేదు. గురుకులం కోసం భిక్షనడుగుతూ నేను 1899 సం॥రంలో రావల్‌పిండి వెళ్ళినపుడు అదేవతను దర్శించినపుడు నాకీ విషయాలన్నీ తెలిసి అత్యంత దుఃఖం కలిగింది. ఆమె శరీరం చిక్కి శల్యమై పోయింది. ఇంటిలో సామానులేవి లేవు. ఐనా శుభ్రంగా లేదు. శోక సంతాపాలు తప్ప ఆమెకు తోడెవరూ లేరనిపించింది. లక్ష్మీదేవిని తీసుకుని జలంధర్ రమ్మని మాతాజీని మరొకసారి నేను ప్రార్థించాను.

శ్రీ పం. లేఖరాంగారి కుటుంబంలో అందరికంటె ఎక్కువగా వారి చిన్నాయన శ్రీ పం. గండారాంగారిని నేను గౌరవిస్తాను. వీరు పెషావర్‌లో "డిప్యూటి ఇన్‌స్పెక్టర్ ఆఫ్ పోలీస్"గా ఉండేవారు. నేనారోజులలోనే పెషావర్ వెళ్ళినపుడు ఆయన నన్ను కలిసి మాట్లాడిన మాటలను బట్టి నా దృష్టిలో ఆయనపట్ల గౌరవం ఇంకా ఎక్కువైనది. ఆయన నన్ను లక్ష్మీదేవిని జలంధర్‌కు తీసుకువెళ్ళమని ప్రోత్సహించారు. అచ్చట కన్యా విద్యాలయంలో ఆమె విద్యాభ్యాసమునకు ఏర్పాట్లు చేయమన్నారు. దానితో పాటు శ్రీమతి లక్ష్మీదేవి తన సమస్తమును ఆర్యసమాజమున కర్పించినచో తాను సంతోషిస్తానన్నారు. ఏలయనగ భగవంతుడు నాకన్నీ ప్రసాదించాడు. అన్నారు.

రావల్‌పిండి ఆర్యసమాజ వార్షికోత్సవం 1899 సం॥రం డిశంబరు 17,18 తేదీలలో నిర్ణయించినందున నేను మరల రావల్‌పిండికి వెళ్ళాను. అప్పుడు మాతాజీ నడిగాను. అప్పటికి బహుశా పం. గండారాం గారు కూడా ఆమెతో మాట్లాడి ఉంటారు. అందువలన తాను స్వయంగా రావల్పిండి నుండి తన కుటుంబాన్ని విడిచి రావటానికి ఇష్టపడకపోయినా లక్ష్మీదేవిని జలంధర్‌కు పంపటానికి ఆమె అంగీకరించారు.

అప్పుడే సికిందరాబాద్ నుండి రావల్‌పిండికి వచ్చిన భజనమండలివారు ధర్మవీర్. పం. లేఖరాంగారిని గూర్చి ఎంతో ఉద్రేకభరితమైన భజనలు పాడారు. ఆ భజనలు వినిపించుట కాభజనమండలివారు లక్ష్మీదేవి వద్దకు కూడా వెళ్ళారు. ఓజస్సు, వీరరసము ,కరుణరసములతో నిండిన ఆ భజనలను విన్న అచ్చటి స్త్రీ - పురుషులంతా వెక్కి - వెక్కి ఏడ్వసాగారు. ఆ భజనలను విన్న లక్ష్మీదేవి స్పృహతప్పి పడిపోయారని నాకు తరువాత తెలిసింది. ఆర్యవిద్వాంసులు లక్ష్మీదేవిని సంతోషపెట్టుటకు చేసిన ఈ కార్యము ఆమె అనారోగ్యమునింకా ఎక్కువచేసినదని తెలిసి నాకు చాలా భాధను కలిగించింది.

ధర్మవీర్ పం. లేఖరాంగారి బలిదానం తరువాత ఉద్రేకంతో పాడే భజనలను లక్ష్మీదేవి పాల్గొనే ఉత్సవాలన్నింటిలోనూ పాడుతుండేవారు. కాని వాటిని వింటూ - వింటూనే ఆమె అన్నిచోట్ల స్పృహతప్పిపడిపోతుండేవారు. 1901 మార్చిలో జలంధర్‌లో జరిగిన ఒక విశేషసభలో శ్రీ పం. లేఖరాంగారిని గూర్చి జరిగిన ఒక ఉద్రేకభరితమైన ప్రసంగాన్ని విని మూర్ఛితురాలైనపుడు నాకీ రహస్యం మొదటిసారిగా తెలిసింది. అప్పటినుండి ఆమె ఉండగా ఏ సభలోగాని, ఉత్సవంలోగాని ధర్మవీర్ పం. లేఖరాంగారిని గూర్చి భాషణ, కవిత, పాటలకు సంబంధించిన కార్యక్రమాలేవి

లేకుండా నేనెల్లవేళలా చూచేవాడిని. 1901 సం॥రంలో లాహోర్‌లో జరిగిన ఆర్య సమాజ ఉత్సవంలోకూడా ఆమె మూర్ఛితురాలైరి. ఇందువలననే కాంగడీ గురుకుల ప్రారంభోత్సవంలో కొందరు సోదరులు ధర్మవీర్ పం. లేఖరాం గారిని గూర్చిన భజనలను వినిపించమని కోరినపుడు నేను వెంటనే తిరస్కరించాను. ప్రారంభోత్సవంలో లక్ష్మీదేవికూడా ఉన్నారు.

రావల్పిండి ఆర్యసమాజ వార్షికోత్సవంలో ఆఖరి రోజున వేదప్రచారమును గూర్చి ప్రకటించి వ్యాఖ్యానం చేస్తున్న మహాశయుడు ఎంతో కరుణతో కూడిన మాటలలో వేద ప్రచార కార్యమునకై ధర్మవీర్ పం. లేఖరాం గారొనర్చిన బలిదానమును గూర్చి శబ్దచిత్రమును చూపారు. లక్ష్మీదేవి అప్పటికప్పుడే తన చెవులనుండి బంగారు దుద్దులను తీసి వేదప్రచారనిధికి ఇచ్చివేశారు. దానమిచ్చినందుకాదేవి కుటుంబీకులు అప్పుడు చాలా గొడవచేశారు. ఆదేవత వారినుండి ఘోరకష్టాలను అవమానమును సహించవలసి వచ్చింది. కాని ఆమె తన స్వాభావికమైన తపో బలముతో ఆ కష్టాలను సహించగలిగారు.

ఆ దానమిచ్చినందుకు అత్తగారుకూడా కోడలితో కఠోరంగా వ్యవహరించినది. కోడలి హృదయంలో అత్తగారిపై ద్వేషభావమును కలిగించరాదని ఆమె తలంచ లేకపోయినది. కానీ అప్పుడు కూడా నేను వచ్చి చూచినపుడు లక్ష్మీదేవిలో ఎలాంటి మార్పూ నాకు కనబడలేదు. లక్ష్మీదేవి జలంధర్ రావటం ఆరంభించిన తరువాత పంజాబు ఆర్యప్రతినిధిసభవారు మాతాజీ మరియు లక్ష్మీదేవి యిరువురకు కలిపి వారి ఖర్చుల నిమిత్తం యిచ్చుచున్న మాసిక భృతిని ఇరువురకు తగిన విధంగా పంచి యివ్వవలసి వచ్చింది. పంజాబు ఆర్యప్రతినిధిసభ అంతరంగ సమావేశంలో కూడా ఈ ప్రశ్న వచ్చింది. ఇరువురు ఖర్చుల నిమిత్తం ఇచ్చే మాసిక భృతిని వేరు వేరుగా ఎవరికెంతెంత యివ్వాలో నిర్ణయించే పనిని సభ నాకప్పగించినది. ఈ భృతిపై ధర్మవీర్ గారి విధవా పత్నికే అధికారముంటుందని అందరికీ తెలుసును. కానీ మాతాజీ కూడా ఆమెతో కలిసి ఉంటారు కనుక ఆమె ఖర్చులు కూడా అందులోనే కలిపి యిచ్చుట ఉచితంగా భావించాము. సభాసభ్యులు లక్ష్మీదేవి తనకొరకు రూ. 8/- ఉంచుకొని మాతాజీకి రూ. 5/- యిస్తూండవచ్చునని తలంచేవారు. కానీ లక్ష్మీదేవి తనంతట తానుగానే మాతాజీగార్కి రూ. 10/- యిచ్చుచుండిరి. దీని తరువాత నేను ప్రయాణంలో ఉన్నాను. ప్రయాణం చేస్తూనే ఉత్తరాలద్వారా లక్ష్మీదేవిని జలంధర్‌కు వెళ్ళమని ప్రేరణ నిచ్చేవాడిని. చివరకు గురుకులంకొరకు

భిక్షనడిగే కార్యమును పూర్తిచేసి 1900 సం॥రం ఏప్రియల్ 8వ తేదిన జలంధర్ చేరుకున్నప్పుడు అంతకంటె ముందుగానే లక్ష్మీదేవి అచ్చటకు చేరుకున్నారు. ఆమె నివాసం కొరకు శ్రీలాలా నగీనామల్‌గారి గృహంలో ఏర్పాటు చేశారు. ఆమె నియమపూర్వకంగా కన్యావిద్యాలయంలో చదువుటారంభించారు. దృఢసంకల్పంతో చదువుచూ లక్ష్మీదేవి కొద్ది సమయంలోనే మంచి ప్రగతిని సాధించారు. కానీ అనారోగ్యం కారణంగా ఆమె విద్యాభ్యాసానికి మధ్యమధ్యలో అంతరాయం కలుగుచుండేది.

ఆ రోజులలో నా వదినెగారు నా కుమార్తెలు ప్రతిరోజూ లక్ష్మీదేవిని తమతో పాటు ప్రొద్దుటకాలినడకకు తీసుకెడుతుండేవారు. ఈవిధంగా ఆమె జీర్ణశక్తిని శారీరిక బలాన్ని పెంపొందించి బాగుచేయడానికి ప్రయత్నాలు జరిగేవి. ఆమె ఒంటరిగా నుండుటవలన ఒకేసారి వండుకొని దానినే రెండు సార్లు తింటూండేవారు. అందువలన ఆమె ఆరోగ్యం పూర్తిగా బాగుపడలేదు. సాధారణంగా ప్రతివారానికి ఆమెకు కడుపునొప్పి వస్తూండేది. ఆమెకు మలబద్ధకం కూడా ఉండి అపుడప్పుడు ఎనిమా చేసుకోనిదే మలవిసర్జన జరిగేది కాదు. ఇలా ఉన్నా ఆమె సత్యార్థప్రకాశం మరియు ఋగ్వేదాదిభాష్యభూమికలోని కొన్ని భాగాలను బాగా చదివి అర్థం చేసుకున్నారు. వీనితోపాటు సాధారణ పాఠ్యాంశాలతో పాటుగ గణితమును కూడా నేర్చుకొనుచుండిరి. చికిత్స పద్ధతిని కూడా విశేషంగా నేర్చుకున్నారు. దీనిని లాలాదేవరాజ్‌గారు శ్రీ పం. విశ్వనాథ గారి వద్ద నేర్పించారు. ఆ శ్రేణిలో చదివిన వారిలో అందరికంటె ఎక్కువగా లక్ష్మీదేవిగారే లాభమును పొందారు. నాడీపరీక్ష, కొన్ని ఔషధాల గుణ-దోషాలు వాటి ప్రయోగం కూడా నేర్చుకున్నారు. ఆమె చాలా నేర్చుకొనుటకు ప్రయత్నించేవారు. కాని అనారోగ్యం ఆమెను ఏమి చేయనిచ్చేది కాదు.

ఆమె కష్టమును ఆరోగ్యపరిస్థితిని బలహీనతలను చూచి నేను నా పుత్రికలతో పాటు మాగృహంలో ఉండుటకు ఏర్పాటు చేశాను. నా పెద్దకుమార్తె వేదకుమారిపై ఆమెకు చాలాప్రేమ ఉండేది. అప్పడే లక్ష్మీదేవి ఆలోచన లెంత ఉన్నతము, ఉత్తమమైనవో బాగా తెలుసుకొనే అవకాశం నాకు లభించింది. ఆమె ఉన్నత భావాలను నేను కూడా ప్రోత్సహించాను. ప్రసిద్ధవైద్యుడు డా. గంగారంగారి వద్ద నిమబద్ధంగా ఆమెకు చికిత్స చేయించనారంభించాను. దానితో ఆమె ఆరోగ్యం రాజురోజుకూ బాగుకాసాగింది. నాకుమార్తెలతో పాటే లక్ష్మీదేవి సత్యార్థప్రకాశ్‌లోని

కఠినమైన విషయాలను నావద్ద చదువనారంభించెను. సంస్కృత భాషను కూడా నేర్చుకొను చుండెను. కొంత ప్రారంభజ్ఞానం సంపాదించిన తరువాత ఋజుపాఠంతో పాటుగ లఘుకౌముది (వ్యాకరణం) చదవాలని తలంచెను. కానీ ఆ రోజులలో నేనొకవైపు గోపీనాథ్ వాలా కేసులో చిక్కుకొని యున్నాను. మరొకవైపు నా కుమార్తె వివాహానికి ఏర్పాట్లు కూడా జరుగుతూండేవి. కావున చదువుచెప్పే అవకాశం నాకు తక్కువగానే ఉండేది. ఐనా లక్ష్మీదేవి తన స్వంత ప్రయత్నం స్వయం ప్రతిభలతోనే చెప్పుకోదగిన ఉన్నతినొందారు. ఆ రోజులలోనే ఒకసారి అవకాశం చిక్కినపుడు లక్ష్మీదేవి నాతో మాట్లాడుతూ - రెండు సం॥రంలు సంస్కృత వ్యాకరణం, ధర్మ గ్రంథాలను ఈవిధంగానే చదివే అవకాశం లభిస్తే జలంధర్ కన్యా ఆశ్రమం పనంతా తానే నిర్వహించగలనన్నారు. కన్యా మహావిద్యాలయంలో (అధ్యాపన) చదువు చెప్పే పనిని కూడా చక్కగా చేయగలనని చెప్పారు.

ఆ రోజుల్లలోనే గురుకులమునకు సేవచేసే బాధ్యత నా కప్పగించబడింది. కావున అనుకున్న దానికంటె ముందుగానే కన్యాఆశ్రమమునకు సంబంధించిన కార్యభారమున్ను వహించుటకై నేనామెను ప్రార్థించవలసి వచ్చింది. నా ప్రార్థననామె వెంటనే స్వీకరించెను. 1901 సం॥రం డిశంబరు నెల మధ్యలో ఆమె జలంధర్ కన్యా ఆశ్రమము పనినారంభించారు. అప్పుడు నాకామెలో నున్న ఉన్నతమైన యోగ్యత కార్యనిర్వహణలో గల దక్షత తెలిసింది. మౌనంగా ఉంటూ ఒక సాధారణ స్త్రీగా కనుపించే ఈ దేవతలో ఇంత మహత్తర శక్తి దాగియున్నట్లు, ఆమె (కన్యల) బాలికలపై పూర్తి అధికారమును కలిగియుంటూ వారిని ప్రేమిస్తూ వారి ఉన్నతికై ఎంతో అమూల్యమైన సహకారాన్నందించగలరని మొదట్లో నేనాలోచించనేలేదు.

రాత్రింబవళ్ళు పనిభారంతో విశ్రాంతి తక్కువగా తీసుకొనుటవలన ఆమెకు బాగా జలుబు చేసింది. 1902 జనవరి 7వ తేదీన నేను జలంధర్ నుండి వెళ్ళిపోయాను. అప్పటి నుండి లక్ష్మీదేవి, కన్యాశ్రమం - మేనేజరు లాలా సోమనాథ్‌గారితో పాటు ఆశ్రమ కార్యమును చేయుచుండిరి. ఆమె తన అనారోగ్యాన్ని గూర్చి ఇతరులకు చెప్పరనే విషయం శ్రీసోమనాథ్‌గార్కి తెలియదు. జనవరి నెలాఖరున నేను మళ్లీ జలంధర్ వెళ్ళినపుడు లక్ష్మీదేవి అనారోగ్య పరిస్థితి నాకు తెలిసింది. నేనా విషయం శ్రీ సోమనాథ్‌గార్కి తెలియజేశాను. ఆనాటినుండి లాలా సోమనాథ్‌గారు వారి ధర్మపత్ని ఆమె ఆరోగ్యవిషయం తెలుసుకొనుటారంభించారు. వారిరువురూ లక్ష్మీదేవిగారికి శ్రద్ధ ప్రేమలతో చేసిన సేవలకు ఆర్యజగత్తు వారికి

ధన్యవాదాలు చెప్పాలి. లాలాసోమనాథ్‌గారు ఆమెకు సేవచేయుటలో ఎలాంటి లోపము చేయలేదు. కానీ ఆమె అనారోగ్యం పెరుగుతూనే ఉంది. పరిస్థితి ఎంతగా విషమించిందంటే ఆమె పగలే మూడేసిసార్లు మూర్ఛితురాలగుచుండిరి. ఫిబ్రవరి చివరిలో నేను మళ్ళీ జలంధర్‌కు వెళ్ళాను. అప్పటి కామె యింకా ఎక్కువగా బలహీన పడ్డారు. ఐనా అప్పటి వరకూ ఆమె చదువు ఎంతో కొంత సాగుతూనే ఉంది. దానితరువాత లక్ష్మీదేవి చాలానీరసంగా ఉండికూడా కాంగడీ గురుకుల ప్రారంభోత్సవంలో పాల్గొనుటకు నిర్ణయించారు.

ఫిబ్రవరి నెలాఖరులో నేను జలంధర్ వెళ్ళినపుడు ఆమెవద్దనున్న 3వేల రూ॥లలో 2వేల రూ॥లు ధర్మకార్యాలలో దానం చేయాలని ఉన్నట్లు నాకు తెలియజేశారు. గురుకుల భూమికి నా చిన్న కుమార్తెను తనతో తీసుకొని వచ్చారు. వస్తూనే ఆమె కనఖల్‌లో జబ్బుపడ్డారు. అచ్చట ఆమె గంగా స్నానం చేసినందున కొంత లాభం కూడా జరిగింది. జ్వరం తగ్గింది కాని ప్రాతకడుపు నొప్పి మరల ప్రారంభమైనది. వైద్యుని చికిత్సతో విశ్రాంతి లభించలేదు. అప్పుడు శ్రీ పం. గంగాదత్తుగారి మందివ్వగా రెండు రోజులలో ఆ మందువలన బాగా ప్రయోజనం చేకూరింది. పండిత్‌జీ మందు, గంగాజలాలతో ఆమెకు తప్పక పూర్తి ఆరోగ్యం చేకూరుతుందని నాకు నమ్మకం కలిగింది. అప్పటికచ్చట ఎలాంటి సౌకర్యాలు, సాధన - సామాగ్రి లేకుండెను. అందరూ డేరా (టెంట్) లలో ఉండేవారు. ఐనానేను లక్ష్మీదేవితో వారిని కొంతకాలం వరకు గురుకుల భూమివద్ద నివాసం ఉండి తన ఆరోగ్యాన్ని కాపాడుకోవలసినదిగ ప్రార్థించాను. స్వయంగా ఆమెకు కూడా ఆరోగ్యం బాగా మెరుగైనట్లు అనిపించింది. ఆమందుతో తప్పక తనకు పూర్తి ఆరోగ్యం చేకూరుతుందని ఆమె కూడా తలంచేవారు. కాని ఆమెకు గురుకులం లోని పనులు, నేను పడే కష్టాలు గుర్తుకు వచ్చి ఆమె అచ్చటినుండి వెళ్ళి పోవటానికే నిశ్చయించారు.

అప్పటి ఆమెలోని ఉన్నతభావాలను నేనన్నడూ మరువలేను. ఆమె మాటలలో చెప్పాలంటే - "అన్నగారూ! భగవంతునకు నన్ను జీవింపజేయాలని, నాతోటి సోదరీమణులకు సేవచేయుటకు నన్నుయోగ్యురాలినిగా చేయాలని ఉంటే, అక్కడకూడా నేను నా కర్మఫలాన్ని అనుభవిస్తూనే తప్పకుండా ఆరోగ్యవంతురాలి నగుదును. కాని నేనిచ్చట ఉన్నట్లైతే గురుకుల సేవలో ఉండవలసిన మీ ధ్యాసంతా యిటువైపే ఉంటుంది" అన్నారు.

ఈ ఉత్సవంలో లక్ష్మీదేవి తన 2వేల రూ॥లను ఛాత్రవృత్తి నిచ్చుటకై గురుకులమునకు దానమిచ్చెను. ఆమె నాతో దానమివ్వాలనే నిర్ణయాన్ని చెప్పినపుడు నేనామెతో మరొకసారి బాగా ఆలోచించమని చెప్పాను. మీరు జలంధర్‌లో ఉంటున్నందున ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని మీ 2వేల రూ॥లు నా సంస్థయైన గురుకులానికి తీసుకున్నానని ప్రజలంతా అంటారని కూడా నేనన్నాను. కాని ఆ దేవత నామాటను వినలేదు. నేనప్పుడు ఈ ఉత్సవంలో పాల్గొన్న పంజాబు ఆర్యప్రతినిధి సభ ప్రధాన్ గారైన పం. రామభజదత్తగారితో లక్ష్మీదేవి దానసంకల్పమును గూర్చి తెలియజేశాను. ఆయనకూడా లక్ష్మీదేవి తన నిర్ణయమును మరొకసారి ఆలోచించవలసినదిగా చెప్పమని నాతో అన్నారు. నేను మరొకసారి ఆలోచించ వలసినదిగా ఆమెతో అన్నప్పుడామె నాతో - "అన్నగారు! బ్రతికే నమ్మకం లేదు. ప్రాణాలెప్పుడు పోతాయో తెలియదు? లోకులనుకొనే వాటిని గూర్చి ఆలోచిస్తూంటే బహుశా ఎటువంటి శుభకార్యమూ జరుగదు." అన్నారు. అప్పుడాదానమును గూర్చి ప్రజలకు తెలియజేస్తూ పం. రామభజదత్తగారు -

"పంజాబు ఆర్యప్రతినిధి సభవారు లక్ష్మీదేవి యిచ్చిన ఈ 2 వేల రూ॥ల దానంతో ఆర్యపథిక్ పం. లేఖరాంగారి పేరున ఒక స్థిర విద్యార్థి - భృతిని ఏర్పాటుచేసి గురుకులమున కిచ్చుటకు నిశ్చయించిరి" అని ప్రకటించారు.

గురుకుల ప్రారంభోత్సవం తరువాత లక్ష్మీదేవి జలంధర్‌కు తిరిగి వచ్చినపుడు అచ్చట ప్లేగుమహామారి వ్యాపించినది. కనుక రెండవరోజే ఆమె లాహోర్ వెళ్ళి అచ్చటినుండి తిన్నగా రావల్పిండికి వెళ్ళారు. అచ్చటి కెళ్ళిన తరువాత ఆమె ఆరోగ్యం యింకా క్షీణించింది. అనారోగ్య విషమ పరిస్థితి ఒకవైపు, గురుకులమునకు 2వేల రూ॥లు దానమిచ్చినందున కుటుంబీకులచే తిట్లు - నిరాదరణలు ఎక్కువై ఉచ్ఛస్థాయికి చేరుకొనుట. మరొకవైపు వీనితో ఆమె ఆరోగ్యం రోజు - రోజుకు క్షీణించసాగింది. విరేచనాలు జ్వరం ఆమెను పట్టి పీడించసాగాయి. లక్ష్మీదేవికి నేను గురుకుల పనులలో మునిగియుంటానని తెలుసును. అందువలన తన పరిస్థితిని గూర్చి నాకేమీ తెలుపలేదు. కానీ లాలాసోమనాథ్ గార్కి ఆమె వ్రాసిన ఉత్తరంలో "నా ప్రాణాలను రక్షించాలంటే ఎవరి నైనా పంపి నన్ను జలంధర్‌కు తీసుకువెళ్ళండి" అని కోరారు. ఈలోగా ఇక్కడింకొక ఆపద వచ్చి పడింది. శ్రీ సోమనాథ్‌గారు ఆశ్రమం నుండి రోపడ్‌కు వెళ్ళుచుండిరి. అందువలన - " లక్ష్మీదేవి రోపడ్‌కు వచ్చి తన కుటుంబంతో ఉండాలనుకుంటే తానచ్చట జీవితాంతం ఆమెకు సేవ

చేయుచుందునని'' అయన వ్రాసి పంపారు. లక్ష్మీదేవి ఇందుకంగీకరించారు.

శ్రీలాలా సోమనాథ్ గారు సత్యధర్మప్రచారక్ సహాయకమేనేజరైన లాలాబస్తీ రాంగారిని పిలిపించి లక్ష్మీదేవిని తనతో పాటు తీసుకొని రమ్మని పంపారు. పం. లేఖరాంగారు జీవించియున్నప్పటినుండే లాలాబస్తీరాంగారి కుటుంబంపై పండిత్‌జీకు మరియు లక్ష్మీదేవిగారికి చాలా నమ్మకముండేది. జూన్ 7వ తేదీన లాహోర్ వెళుతూండగా నాకు జలంధర్ రైల్వేస్టేషన్లో లాలాబస్తీరాంగారు కలిశారు. నాతోపాటు వారు లాహోర్ వరకు ప్రయాణం చేసి రావల్పిండికి వెళ్ళారు. జూన్ 9వ తేదీన నేను లాహోర్ నుండి జలంధర్‌కు వచ్చాను. అప్పటికి లక్ష్మీదేవి కూడా వచ్చిఉన్నారు. నేనామెను దర్శించుటకెళ్ళాను. ఆమె బలహీనతను చూచిన నాకు పెద్ద అఘాతం తగిలింది. ముఖం మీద క్షయ వ్యాధి లక్షణాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. వెంటనే వైద్యులు డా. గంగారాం గారిని పిలిపించి నియమబద్ధంగా చికిత్స చేయించసాగాము.

శ్రీ లాలా సోమనాథ్‌గారు కుటుంబసమేతంగా జూన్ 15వ తేదీన రోపడ్‌కు వెళ్ళుటకు సిద్ధమైనారు. కాని వైద్యుని సలహా ప్రకారం - లక్ష్మీదేవి ప్రయాణం చేసే స్థితిలోలేరు. డా. గంగారాం గారు స్టెథస్కోప్‌తో ఆమె ఆరోగ్యమును పరీక్షించి క్షయ వ్యాధియనే సందేహమును వ్యక్తం చేశారు. బహుశా దాని ప్రభావం ఊపిరితిత్తులకు కూడా వ్యాపించి ఉండవచ్చును. అప్పుడు సివిల్‌సర్జన్ డా. స్మిథ్ గారిని కూడా పిలిపించాము. ఆయన బాగా పరీక్షించిన మీదట వ్యాధిని గూర్చి తెలియజేసి ఆశకు బదులు నిరాశను వదలి వెళ్ళారు. మందులు, పథ్యములు సాగుచునే ఉన్నాయి. కానీ ఆమె జీవింతలో సంధ్యా సమయం సమీపించసాగింది. జీవితమే ముగిసే సమయంలో ఇప్పుడింక మానవ ప్రయత్నాలతో లాభమేముంటుంది?

నేను అత్యవసరంగా గురుకులానికెళ్ళాల్సిఉంది. కాని ఎన్నో కారణాలవలన జలంధర్‌లోనే ఉండాల్సి వచ్చింది. లక్ష్మీదేవిగారి అనారోగ్యం కూడా ఒక ముఖ్య కారణం. నామీద ఆమెకు చాలా నమ్మకముండేది. నేను జలంధర్‌లో ఉంటే తనకు చికిత్స బాగా జరుగుతుందని ఆమె అనుకునేవారు. నేను కూడా ఆమెకు సేవ చేయుట నాధర్మంగా తలంచేవాడిని. దానికొకకారణం - ధర్మవీర్ పం. లేఖరాం ఆర్యపథిక్ గారి ధర్మపత్నిగా ఆమెకు నేనిచ్చే గౌరవం. రెండవ కారణం - ఆమె శీలస్వభావ సద్గుణాలను నేను వ్యవహారంలో ఉత్తమమైనవిగా చూడగలిగాను. నేను నా హృదయ పూర్వకంగా ఆమెను గౌరవిస్తూండేవాడిని.

ఆమె శరీరం వ్యాధితో రోజు - రోజుకూ క్షీణించసాగింది. నేను వెళ్ళాల్సిన

తొందర కూడా ఉంది. శ్రీలాలా వజీర్ చంద్రగారికి చికిత్స చేయించే కార్యము నప్పగించాను. ఆ రాత్రి బండికి వెళ్ళటానికి ప్రయాణమయ్యాను. రాత్రి నేను వెళ్ళే సమాయానికి లక్ష్మీదేవి ఆరోగ్యం బాగా క్షీణించింది. నేను ప్రయాణం మానుకున్నాను. ఉదయం బండికెళ్ళాలనుకున్నాను. ఆమెకు చెప్పకుండానే వెళ్తారా? అని మిత్రులంతా అన్నారు. ఆమెను కలిసి వెళ్ళటమే మంచిదని నిశ్చయించుకున్నాను. వెళ్ళేముందు ఆమెను చూడటానికెళ్ళాను.

"నమస్తే" అన్ననాకు "నమస్తే" అని జవాబిచ్చి, నేను మాట్లాడేలోగానే ఆమె "మీరు గురుకులం ఎప్పుడు వెళుతున్నారు." అని అడిగారు.

"అందుకునేను :- నేను వెళ్ళటానికి తయారయ్యేవచ్చాను. నేను ఉండాల్సి వస్తే ఉండిపోతాను." అన్నాను.

లక్ష్మీదేవి :-" మీరచ్చట ఉండటం అవసరం. మీరు వెళ్ళండి" అని జవాబిచ్చారు. నేను చివరిగ ఆమెకు నమస్కరించి వెళ్ళిపోయాను.

నేను వచ్చేసిన తరువాత ఆమె పరిస్థితి రోజు-రోజూ బాగా క్షీణించసాగింది. ముందుగానైతే ఆమెకు కోలుకుంటాననే ఆశకొంత ఉండేది. డా. గంగారాం గారి మందు పనిచేయటం లేదని తెలిసి మానివేసినపుడు ఆమె డాక్టరు గారిని పిలిపించమన్నారు. "బాబుగారిచ్చట ఉన్నట్లైతే ఆయన తప్పకుండా పెద్ద డాక్టరు గారిని పిలిపించేవారు" అని కూడా ఆమె అన్నారని నాకు కబురంపారు. కానీ జూలై 3వ తేదీన ఆమెకింక వెళ్ళిపోతాననే విశ్వాసం కలిగింది. అందువలన ఆమె కొందరు పెద్దమనుష్యులను పిలిపించి వారిముందు తన ఆస్తి విషయం వీలునామా వ్రాయించారు. దానిని అక్షరాలా శ్రీ బాబూ అమర్‌సింహ్ బి.ఏ. వకీలు గారు వ్రాసిరి.

ఆ వీలునామాలో ఆమె 2 వేల రూ॥లు ముందుగానే కాంగడీ గురుకులాని కిచ్చినట్లు తెలిపారు. సుమారు 7 నుండి 8వందల ఖరీదుగల ఆమె ఆభరణాలు, 4వందల నగదు అంతకుముందే తనతోపాటు జలంధర్ వచ్చిన అత్తగారికిచ్చారు. ఒకపెట్టెలో కొన్ని పట్టు వస్త్రాలు, 40రూ/- లనోట్లు రెండు, 8రూ॥ల నగదు కలదు. ఆమెవీటిని వివాహం జరుగబోతున్న ఒక అనాథ బాలికకు, యిచ్చివేశారు. ఆర్య ప్రతినిధి సభ - పంజాబు వారి వద్ద జమచేసిన సుమారు 6వందల రూ॥లను పం.లేఖరాం స్మారకనిధికి యిచ్చివేశారు. ఈ వీలునామా వ్రాసిన మరునాడు ఆమె మాట కూడా ఆగిపోయింది. జూలై 3వ తేదీన ఆమె ప్రాణాలు విడిచారు. ఆర్యసామాజికులు ఆమె అంతిమ సంస్కారాన్ని చేశారు.

లక్ష్మీదేవి జీవితం నిజంగానే సతియొక్క జీవితం. కష్టాలన్నింటిని ఆమె గుండెలలోనే దాచుకొని సహించిన ఆమె శక్తి లేఖలద్వారా చదివే మనవంటి వారికి అర్థం కాదు. సతి తన కార్యమును పూర్తిచేసి వెళ్ళిపోయారు. మన దుఃఖ - సానుభూతులతో ఆమెకిప్పుడేమీ సంబంధంలేదు. అవసరం కూడా లేదు. ఆమె పూర్ణ ముక్తావస్థను పొందలేకపోయినా, వారు తన (భవిష్యత్) రాబోయే జన్మలో, ఈ జన్మలోని సంస్కారములకు తగిన ఉత్తమజన్మను తప్పక పొంది మిగిలిన కార్యము నా జన్మలో పూర్తిచేయుదురనుటలో ఎలాంటి సందేహం లేదు.

ఓ దేవీ! మీ శుభసంకల్పాలు పూర్తిచేయలేనటువంటివి కావు. కానీ మీ సహకారంతో తనకు శుభము-కల్యాణము జరిగే భాగ్యమే ఈ అభాగ్యదేశానికి లేదు. పాఠకులారా! ఆ సతి జీవిత చరిత్ర నేడు మనం చూస్తున్న వారి జీవితం వంటిది కాదు. ఆమె జీవితం మీకే సందేశాన్ని ఇవ్వదా? తనలో పరోపకారభావాన్ని నింపుకొని శుభసంకల్పవతియైన ఒక స్త్రీ దేవత తాను తలపెట్టిన శుభకార్యమును పూర్తి చేయలేకపోయినచో ఆదేశపరిస్థితి శీఘ్రముగా క్షీణించిపోవుననే విషయం మీకు తెలియదా?

ఆ రోజులలో నిజమైన సానుభూతి ఈ దేశంలో ఎక్కడుంది ? వైదిక ధర్మంయొక్క సత్యవాక్కులను ఘోషించే ఆర్యసామాజికులలో విశుద్ధ భావనలుండాలి. ప్రపంచమంతా విరోధంతో వ్యంగ్యంగా వేసే బాణాలతో తగిలే దెబ్బలను సహించగలిగి ధర్మమును దృఢంగా పాటించగల ధీరులుండాలి. శ్రీమతి లక్ష్మీదేవిగారివంటి పతివ్రతలయొక్క సహనశీలమే ఈ గాఢాంధకారంలో నాకు కనబడే ఒకేఒక కాంతిరేఖ.

ఆమె ప్రభావం ఆమెతో పాటే నశించిపోదు. ఆమె రాబోయే సంతానాన్నికూడా ప్రభావితంచేస్తూ చిరస్థాయిగా ఉంటారు.

ఓ దయానిధీ! మేముతలపెట్టిన కోరిక పూర్తి కాగలిగితే, ఈ దేశం తనదుష్కర్మలకు శిక్షననుభవించినట్లైతే, ఈ జన్మలో కంటె ఇంకా ఎక్కువగా తయారై తన ఉద్దేశ్యమును పూర్తిచేయుటకై దివంగతురాలైన శ్రీమతి లక్ష్మీదేవిగారి ఆత్మకు మరల జన్మనిమ్ము.

హిందీ మూలం : స్వ. స్వామీ శ్రద్ధానంద మహరాజ్

అనువాదం : సంధ్యావందనం శ్రీనివాసరావు



22-6-1936 26-7-1991

# ధన్యవాదములు

స్వర్గీయ మాశెట్టి జయప్రదాదేవి, స్మారక చిహ్నముగా ఈ చిన్న పొత్తము ముద్రింప బడినది.

స్వర్గీయ శ్రీమతి మాశెట్టి జయప్రదాదేవి, శ్రీ దుందిగల్ల జగదీశ్వరయ్య బాలమణి జననీ జనకులకు ముద్దుబిడ్డ. స్వర్గీయ శ్రీ మాశెట్టి హనుమయ్యగుప్త గారికి కోడలు. శ్రీ మాశెట్టి వేంకటేశ్వరరావు గారి సతీమణి. ఈయనకు ఇద్దరు మగపిల్లలు. శ్రీనివాస్, శశికాంతులు. శైలజ, సవితలు బిడ్డలు. నలువురు స్వస్వసంతానములతో నానందముగ కాలము నయించు చున్నారు. సుసంపన్న గృహిణిగా, పుట్టిన యింటికి, మెట్టిన యింటికి తన శాంత స్వభావముతో ప్రసన్నవదనముతో, పతికి అనుకూలవతియై, బిడ్డల ప్రేమను చూరగొన్నదై, సుప్రసన్నమైన జీవితము గడిపిన యిల్లాలు ప్రారబ్ధము పూర్తికాగా చిన్నవయస్సునందే సిరిసంపదలతో తులతూగు చున్న తనకుటుంబమును చూచుచు శాంతముగా భర్త యొడిలో దివంగతయైన ధన్యురాలు

(అంగీరస - యుగాది - ౧౯౯౨) పం. గోపదేవ్

తమ మాతృదేవత అనురాగస్మృతిలో ఈ లఘు పుస్తకమును ముద్రించి మా ట్రస్టుకు విరాళముగా నిచ్చిన స్వ. మాశెట్టి వేంకటేశ్వరరావు, జయప్రదాదేవి గార్ల పుత్రులు, పుత్రవధువులకు పరమేశ్వరుడు సదా ఆయురారోగ్య ఐశ్వర్యాదుల నిచ్చి సుఖింపజేయుగాక! యని ప్రార్థించుచూ హార్దిక ధన్యవాదములతో

సంధ్యావందనం శ్రీనివాసరావు
(కార్యదర్శి - గాయత్రీ ఆశ్రమ ట్రస్టు)